# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

## ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] [సంచిక 1

**15 ఏప్రిల్ 1952**





సంపాదకులు:
శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు బి.ఏ.

వ్యవస్థాపకులు:
శ్రీయుత ఉదర వెంకయ్యగారు.

ప్రకాశకులు:
రామా అండ్ కో
ఏలూరు

V.S GURU

# విషయసూచిక





# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] ఏలూరు, ఏప్రియల్ 15 [సంచిక 1





**వివరణము :**

శాస్త్రపరిజ్ఞాన మొక్కటియే చాలదు. అది మొదటిమెట్టు కావచ్చును. కాని గంభీరవిషయము లావలనున్నవి. మన మా విద్యాలయమునే చేరవలెను. శాస్త్రము-భగవత్సమాగమము- కలిసి యోగమగుచున్నవి. యోగమను పదమే చాల పవిత్రమైనది. ఉచ్చరించిన మాత్రమున శాంతి చేకూరును. అది భగవంతునితో ఐక్యమును బోధించుచున్నది. అంతరంగమున మనము ప్రవేశింపవలెను. ఆ మార్గమునే యోగము బోధించును.

**సంకీర్తనము :**

హేదయామూర్తీ! అమోఘమగు నీ యాశీర్వచనమున కెదురు చూచుచున్నాను.
నా జీవితము ధన్యత గాంచునుగాక !
భక్తి ప్రపత్తులచే నా చిత్తము నీ పాదములయందు బంధింపఁబడునుగాక !
నే నెన్నడును నీకు దూరము గాకుందును గాక !

స్వామి రామతీర్థ..



# శుభాకాంక్షలు

౧

"ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య"—41 వ జన్మదిన శుభసమయమున నాహృదయపూర్వక శుభాకాంక్షలు.

విద్యావిషయకముగా మనకెంతయు నుపయోగపడు నుత్తమాదర్శములతో నీ పత్రికామతల్లిని నడపుచున్న సంపాదక-వ్యవస్థాపక మహాశయులకు, పఠితృలోకమునకు, భగవంతుడు మహోజ్జ్వలమగు భవిష్యత్తును ప్రసాదించునుగాక !
నందన సంవత్సరము దేశికలోకమునకు, భారతప్రజానీకమునకు, ఆనందదాయకమగుగాక!
విశ్వము శాంతిభద్రతలతో తులదూగుచు నందనోద్యానభూముల విహరించుగాక!

జైహింద్ ! ఆణివిళ్ళ సుబ్రహ్మణ్య మోహనదాసు,
ప్రధానోపాధ్యాయుడు, మిరకచామవరం.

౨

ఓ పత్రికామతల్లీ !

నీవుపుట్టి నలుబదియేండ్లు నిండినవి. నలుబది ఒకటవయేడు ప్రారంభమయినది. ఇంతకాలమునుండి ప్రాథమిక విద్యాలోకమునకు నీవు చేయుచున్న సేవ అపారము. బడి పంతుళ్ళ కష్టనిష్ఠురములను, కడగండ్లను, ప్రభుత్వము వారికిఁదెల్పు నీకును, నీసంపాదక వర్గమునకును మాహృదయ పూర్వక ధన్యవాదము.

మానుండి ఎక్కువ మూల్యమును గోరక, ఒక్కరూపాయితో ఏడాది పొడుగున మాకొఱకు పాటుపడునీకు మా జేజేలు !

ఇంతనుండి కూడ ప్రాథమిక విద్యనుగూర్చి బహుళ ప్రచారము గావించుచు, నవీన విద్యావిధానముల మాకుదెల్పుచు, మాగోడు ప్రభుత్వమునకు వినిపించుచు, మా యాదరాభిమానముల జూఱగొనుచు, సాటిలేని పేరు ప్రతిష్ఠలతో పెంపుగాంతువుగాక !

నందన నీకు నందనమై ఆనందదాయక మగుగాత ! ఆర్. సుబ్రహ్మణ్యాం,
టీచరు-గంగలకుర్తి అగ్రహారం.

3

బోధకోపాధ్యాయులారా !

గతనలుబది సంవత్సరములనుండి ఆంధ్రరాష్ట్రమున ప్రారంభవిద్యావ్యాప్తికై "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" పాటుపడుచున్న సంగతి ఎల్లరకు సువిదితము.

ఈ నూతన నందన వత్సర శుభప్రారంభసమయమున మన "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య"ను నేను మిక్కిలి అభినందించుచున్నాను.

మిక్కిలి నేర్పరులగు శ్రీమహావాది వేంకటరత్నంగారి సంపాదకత్వమునను, వ్యవస్థాపకులైన శ్రీ ఈదర వెంకయ్యగారి ఆర్థిక సహాయముచేతను, ఈ పత్రికారాజము విద్యావిషయకముగను, సాంఘిక-ఆర్థిక-రాజకీయ-వైజ్ఞానికముగను, ఉపాధ్యాయలోకమునకు దగినంత విజ్ఞానమును ప్రసాదించుచు పాఠకులయొక్కయు,విద్యాధికుల యొక్కయు. బోధకులయొక్కయు, విద్యార్థుల యొక్కయు, నిరంతరాదరాభిమానములం జూఱగొనుచు, ఇతోధికముగా వర్ధిల్లగలందులకు భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఈ నూతన వత్సరారంభమునుండి ఉపాధ్యాయసోదరు లెల్లరు చందాదారులుగ జేరి యీపత్రికామతల్లిని సర్వవిధముల అత్యున్నత స్థాయికి తేగోరెదను.

ఓ పత్రికామతల్లీ! నిరంతరము మాకొఱకు శ్రమించుచున్న నిన్ను చిన్నచూపు మేము చూడబోము. మాయాదరమున నీవు సర్వాంగ సుందరముగ శోభింతువుగాక!

జైహింద్ ! అల్లంరాజు బంగారం,
టీచరు-కొంతంగి.

---

## —: విద్యాప్రబోధగేయము :—

(మంచిచిన్నదీ-మామంచిచిన్నదీ-అను పెళ్ళికూతురులోని వరుస)

(1) మంచిచదువులూ-మా మంచిచదువులూ-మన
గ్రామ పాఠశాల నెపుడు-మరువక-నేర్చిన_చదువే॥మంచి॥

(2) తెల్లవారగానె లేచి-దేవుని ప్రార్థించి సదా-స్నాన
మాడి-తల దువ్వి-తెల్లని వస్త్రములు వేసి-క్రమ
ము తప్పకుండ-రెండుపూటలందు-బడికి పోయి-భక్తితోడ
గురుదేవుల-మన్ననలకు-గురియౌచు-చదువుకొన్న-చదువులూ॥మంచి॥

(3) తల్లిదండ్రి చెప్పుమాట-మరువక-పాటించాలీ-మాట మరువక-పాటించాలీ,
తెలియ దనక-శ్రద్ధతోడ-చదువును-చదవాలీ
గురుదేవులు-నేర్పుచదువు-మీరక-చదవాలీ-అడ
కువతో-అట్టిచదువు-కొరతలేక-యెల్లప్పుడూ-చదివిన-చదువే చదువూ॥ మంచి॥

(4) నీదు పాఠశాల-నెపుడు-యల్లరి గొనరాదు
గురుల సమక్షముల-నెపుడు కల్లలాడరాదు
పేదవారి పిల్లలంచు-హీనముగా జూడరాదు
చదువు బాగుగా నేర్చిన-అడకువతో మెలగు-చదువే॥మంచి॥

(5) గురుతుమీర-మంచిచదువు-నేర్చుకొనాలీ-మన
పాఠ బాలు రంత కలసి-యొకటై యనాలీ-బడి
విడువగానె-ఆరోగ్యపు-ఆటలాడాలీ-రాత్రు
లందు-శ్రద్ధమీర-చదువు-కొనాలీ॥మంచి॥

పల్ల స్వామినాయుడు-టీచరుమానేజరు-గొలుగువలస.

# చచ్చేవారికి చచ్చేవారు బోధించడమా !

రచన - శీలా వెంకటప్ప - కమలాపురం

చెన్నరాష్ట్రములో వయోజన విద్యా వ్యాప్తికై గతనాలుగేండ్లుగా మన రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం సహాయముతో 15 లక్షల రూపాయలు ఖర్చుపెట్టి, వయోజన విద్యా ప్రణాళికను కొనసాగిస్తున్నది. ఈ నాలుగేండ్ల హయాంలో యెంత వరకు వయోజన విద్య సాఫల్యం పొందినది సింహావలోకనం చేసుకోవడం అత్యవసరం.

మనరాష్ట్రములో ఏటేటా నూర్లకొలది వయోజన కేంద్రాలు నెలకొల్పుతూ, అనేకమంది ఉపాధ్యాయులకు, ప్రచారకులకు, ఆఫీసర్లకు, శిక్షణ యిప్పిస్తూ పాటుపడుచున్నది. వీరిపై అధ్వర్యానికి గజెటెడ్ హోదాగలిగిన కొంతమంది అడల్టు ఎడ్యుకేషన్ ఆఫీసర్లు, గుమాస్తాలు, కలిగిన ఒక గౌరవ వయోజన విద్యాశాఖ డైరెక్టరును నెలకొల్పబడి యున్నాడు. ఈ విద్యకు తగ్గమొత్తాన్ని విద్యాశాఖ డైరెక్టరు తన విచక్షణాధికారాన్ని బట్టి వినియోగిస్తూ వుంటాడు. ఈ నాలుగేండ్లలో బక్కచిక్కిన ప్రాథమికోపాధ్యాయులు, ప్రచారకులు, మన రాష్ట్రములో అనేక వేల వయోజన విద్యాకేంద్రాలు నెలకొల్పి యున్నారు.

అయితే ప్రభుత్వం ఇటు బోధలకు, ప్రచారకులకు, అటువయోజనులకు యే మాత్రం ప్రోత్సాహం కలిగించనందున వీరిలో నిరాశా, నిస్పృహలు జనించినందువల్ల వయోజన విద్యాప్రణాళికకుం తీవ్ర అవరోధం యేర్పడింది తత్ ఫలితంగా వయోజన విద్యముందుకు కొనసాగలేక పోయింది వయోజనులకు కావలసినన్ని పుస్తకాలు పలకలు ప్రభుత్వం సహాయం చేయనందున వారి విద్యా వ్యాప్తికి తీవ్ర వ్యాఘాతం యేర్పడింది వారిని ఆకర్షించేందుకు విరివిగా బోధనోపకరణములు కూడ సహాయం చేయనందు వల్లను, బోధకుల్ని ప్రచారకుల్ని ఉత్సాహ పూరితులుగా చేయలేనందువల్లనూ, వారి ఆర్థికస్థితిని యే మాత్రం పెంచలేక పోయినందువల్లను కూడ, పెద్దల విద్యావ్యాప్తికి ప్రతినిరోధం యేర్పడింది.

గతనాలుగేండ్లుగా మనరాష్ట్రములో తిండి గుడ్డలకు లోటు యేర్పడ్డంతో నేడు పాటక జనానికి క్షణమొకయుగంగా వుంది జీవితమే మహాదుర్భరమై పోయింది ఇట్టి పరిస్థితిలో రాత్రి పాఠశాలలకువచ్చే వయోజనులు పగలంత కాయకష్టంచేసి వస్తేగాని వారిజీవనం గడువదు ఎంతో బడలికతో ఆయాసముతో విశ్రాంతిని అభిలషిస్తూ వుంటారు. తిరిగి వుదయం యెవరికి కూలికి పోవాలి ? శేషజీవనం గడిచేదెట్లు ? అనే తహతహ ఆవరిస్తూ వుంటుంది ఈ నాడు శ్రమ జీవికి రెక్క ఆడితేగాని డొక్క నిండేటట్టులేదు. నిరంతరం జీవయాత్రను గూర్చియె ఆలోచించవలసిన దుస్థితియేర్పడింది విద్యనుగూర్చి ఆలోచించుటకుకూడ

(కల్పితము.)

## కమలము చుట్టు కాలసర్పములు




బి. పి. రామచంద్రారెడ్డి,
కార్యదర్శి, చదుం.


కాసారములో
కమలము చుట్టు
కాలసర్పములు
కాచియుండుట
కనుగొనుడయ్యా !

౧

విశాలరాష్ట్ర
విద్యాధికారి
విచ్చేశా రని
వినికిడి కాగనె
విద్యాకరుని
విలోకింపగ

వీలు పడెనని
పెన్నిధి గాంచిన
పేదపోలికగ
పరమానందం
పొందా డొక
పేదపంతులు ;

---

(౬ వ పేజీ తరువాయి)

తీరికలేదు. దేశం ఆర్థికంగా బాగుపడి శ్రామిక జనానికి ప్రశాంతతలభించినప్పుడు గాని, వీరు విద్యనుగూర్చి ఆలోచించరు, నగ్న హృదయాలతో నిరాశా నిస్పృహలతో తిండిలేక చచ్చేవారికా మనం బోధించడం ?

ఇక మనసంగతి ఆలోచిద్దాం దుర్భర దారిద్ర్యంతో, ఆకలిమంటలతో పగలంతా బడిలోబోధించి "దినగండం నూరేళ్ళాయుస్సు" అన్నట్లుకాలం వెళ్ళ బుచ్చుతున్నాం నేడు ఒకటికి పదింతలు ధరలు పెరిగి ఆకాశాన్నంటు కొంటూవుండినాకూడ మనజీవన ప్రమాణం యేమాత్రం పెరగలేదు. సరిగదా అను దినం / సంఘటితమయ్యే కడగండ్ల ప్రవాహంలో మునిగి తేలుతూ వున్నామనల్ని ప్రభుత్వం యేమాత్రం కనికరించడంలేదు. బక్కచిక్కిన శరీరాలతో, అనారోగ్యంతో నగ్నహృదయాలతో క్రుంగి కృశించి చస్తూవున్నా బోధించవలెనా ?

వయోజనవిద్యాప్రణాళిక నిజంగా సాఫల్యం పొందవలెనన్న, వయోజనులు ఆర్థికదుస్థితినుండి కోలుకొనేందుకు మార్గాల్ని అన్వేషించాలి విద్యాభిలాషను కలిగించేందుకు నవ్యవిధానాలనుకూడపరిశోధించాలి.

వయోజన విద్యాబోధలకులను ఆర్థికదుస్థితినుండి విముక్తులచేసి వారికష్టానికి తగ్గట్లు విశ్రాంతిని, వేతనాలను పెంచి, ఉత్సాహవంతుల చేయాలి లేకపోతే చచ్చే వారికి చచ్చేవారు బోధించడమేఅవుతుంది.

కనులకింపుగ
కాంచవలెనని
కలలుకన్నాడు ;
వీనులవిందుగ
ఒకమారైన
వినిపోవుదమని
వలపుజెందాడు ;

వీరినివారిని
విచారించగ
ఊరికిబయట
బంగళాలోన
బిడారించిన
ప్రాజ్ఞునిపత్రా
పరికించాడు.

౨

పంచను పట్టి
పరాకు చేయక
పారా కాచుచు
పరిచర్యలను
పరిపాలించెడి
పరీక్షకుని
వీక్షింపగనే
వెన్ను విరిగింది ;
వాకిలి కెదురుగ
వెళ్ళు చుండగ
వాకిలిమాస్టరు
వైదొలు గంటూ
వాడిచూపులతో
వెకిలి పల్కాడు.

పాకశాలలో
పరిపరిపక్వ
పదార్థములను
పోషణించు మని
పరిచారకులను
పరుషోక్తు లాడెడి
ట్రైనింగుస్కూలు
“ టైగర్ హెడ్ ”
కంటపడగనె
కలత జెందాడు ;

“ డైరక్టరును
దర్శించుటకు
దయపెట్టాలని ”
దడయుచు
దీనపంతులు
దండముపెట్టగ ——
‘ చీటికి మాటికి
చేకూరదు నాకే
చులకన కాదే ?
నీవు కోరుటా ?
నిర్భాగ్యుడ ’యని
నిరాధారుని
నిరాకరించాడు
నిలువక వెంటనే
నిర్గమించు మని
నియోగించెను
నిర్దయతతో.

కలకపాటుతో
కళ్ళనీళ్ళతో
కిటికీ కడను
కాళ్ళు కదపగ
క్యాంపుక్లర్కు
కర్కోటకమై
కరకరించుచు
కటువ బొయ్యాడు.

## - - - వయోజనవిద్య - గేయము - - -

[రామజోగి మందు కొనుడీ-జనులారా! అను మాదిరి]

చదువు చక్కగా-బడయుడి మీరు
వయోజనులారా !
తెలివి తేటలు – పొందుడీ మీరు
రాత్రిబడులను నిల్పి మీరు
దినమున కొక గంట చదివిన
ఆరుమాసాల్లోనే మీకు
చదివే వ్రాసే యోగ్యత కలు॥ చ॥ 1
మాతృదేశము స్వేచ్ఛావనియే
పాలకులు – ప్రజాధినేతలే
విద్యావ్యాప్తికి – నవకాశం బిది
ప్రభుత్వ సాయము కోరి మీరు॥ చ॥ 2
నలుబదికోటుల భారతప్రజలో
విద్యావంతులు – మిక్కిలి స్వల్పము
వయోజన విద్యను వృద్ధిచేసిన
భారతదేశము భాగ్యవంతమా॥ చ॥ 2
సర్వవిద్యలకు వాసి కెక్కిన
పేరుప్రతిష్ఠలు పొందిన ప్రజలు
నిరక్షరాస్యులై నిర్జీవులునై
నిల్చియుండుట సిగ్గుల చేటుగా॥ చ॥ 4
ధనము కలిగిన దాతల్లారా ?
సిరులతో దూగే సదయుల్లారా !
విద్యాదానమే – శ్రేష్ఠం బౌనని
సోదరవిద్యకు – సాయము చేయుడీ॥ చ॥ 5
జ్ఞానముకలిగిన చదువరులారా !
తీరిక కలిగిన గడియలందు
అక్షరశూన్యులౌ వయోజనులకు
ఉచితవిద్యను గఱపుడి మీరు॥ చ॥ 6

—బి. పి. రామచంద్రారెడ్డి.

---

(౮ వ పేజీ తరువాయి)

3
సముక్షముననే
సంకటపెట్టుట
సమగ్రముగ
సంధానించెడు
సద్గుణపుంజుడు
సహృదయుడు
సర్వవిద్యల
సదాశివయ్య
సాధుజ్జనకు
సామవాక్యముల
స్వాగత మిచ్చి
సన్మానించి
సాగనంపెను.

కాసార మనెడు

కలికాలములో
కమలము లనెడి
కరుణాకరులను
కర్కోటకులు
కాలసర్పములై
కాచి యుండుట
కాలమహిమయని
కళావేత్తల
కర్మకారుడు
క్లేశము వీడాడు.

# ప్రావిడెంటు ఫండురూల్సు

(మార్చి నెల తరువాయి)

తర్జుమాదారు : కొండ్రెడ్డి సూర్యప్రకాశం

(ఐ) గవర్నమెంటు కంట్రిబ్యూషనుగా యిచ్చే సొమ్ము చందాదారుయొక్క ఆఖరికినిలవ బాకీ మొత్తం సొమ్ముమీద లెక్కింపబడును. కాని సేవింగ్సు బ్యాంకు ఎకౌంటుచందాదారుడి పేరుఅయినప్పుడో, లేక 60 ఏండ్లవయస్సు నిండినప్పుడో, లేక అనుమతింపబడిన యితర కారణములచే మానివేసినప్పుడో, వీనిలో ఏదిముందు తటస్థించునో అప్పుడు సేవింగ్సు బ్యాంకు అక్కవుంటు మూసివేయబడును. (అనగా మొత్తంసొమ్ము చందాదారుని కిచ్చివేసెదరు) ఒక చందాదారు తనఫండునుండి సొమ్ముతీసికొన వలంచినప్పుడెల్లను కారణములతోసహా ఆ స్కూలు మేనేజరులేక కరస్పాండెంటు ద్వారా-ఒక దరఖాస్తును జిల్లావిద్యాశాఖాధికారికి-లేక అధకారిణికి దాఖలు చేసుకొనవలెను. జిల్లావిద్యాశాఖాధికారి ఆకారణములతో తృప్తిపడినయెడల ఆ ఎక్కవుంటు మూసివేయవచ్చునని అనుమతించి, ఒక సర్టిఫికేటును జారీచేయును. ఆ సర్టిఫికెట్టునందు అచందాదారు ఫలాని కారణములవలన ఫండును చెల్లించుటకు మానివేసెను. కనుక గవర్నమెంటు కంట్రిబ్యూషనుకు అర్హత గలదని వ్రాయబడును. అందుపైని పోస్టుమాస్టరు సేవింగ్సుబ్యాంకు ప్యాసుబుక్కులోని అక్కౌంటు మూసివేయును. పిదప డిపోజిటరుచే సంతకము చేయబడి, పాఠశాలగుమాస్తా-లేక-ఇంట్రోటరు లేక ఇతరవ్యక్తిద్వారా సొమ్ముయిప్పించుడని వ్రాసిన విత్ డ్రాయల్ ఫారం ప్రకారం స్కూలుమేనేజరు, లేక కరస్పాండెంటుచే చందాదారు తరఫున అవ్యక్తికి చందాదారు యొక్కవుంటునిలవ మొత్తం సొమ్ము తెప్పించి చెల్లించివేయును. సేవింగ్సుబ్యాంకులో నున్న సొమ్ము అట్లుతీసివేసిన తక్షణమే, ఆస్కూలు మేనేజరు, లేకకరస్పాండెంటు, ఎక్కవుంటుమూసివేసిన తేదీని జిల్లావిద్యా శాఖాధికారి, లేక అధికారిణికి, తెలియచేయును. వీరుతపాలా, తంతిడిపార్టుమెంట్లు డిప్యూటీ అక్కవుంటు జనరల్ వద్దనుంచి చందాదారునియొక్క ముగింపబడిన ప్యాసుబుక్కులన్నియు తెప్పించి, ప్రభుత్వము వారివ్వవలసిన 1/3 వంతు కంట్రిబ్యూషను సొమ్ముగూడ యిచ్చివేయుటకై ఒకబిల్లును తయారుచేయుదురు. స్కూలుమేనేజరు, లేక కరస్పాండెంటు, తపాలాకచేరినుండి సొమ్ముఅందుకొన్న పిదప అక్విటెన్సురోల్సులో సంతకము చేయించుకొని, ఆచందాదారున కిచ్చివేయును. అట్టి అక్విటెన్సులు విజిట్ల సమయములో పరీక్షాధకార్లు తనిఖీచేయు తాత్కాలిక విత్డ్రాయల్సు అయినచో స్కూలులో భద్రపరచవలెను. కాని పూర్తిగా సొమ్ముతీసివేసి కొన్నప్పుడుమాత్రము జిల్లా విద్యాశాఖాధికారిద్వారా అక్కౌంటెంటు జనరల్ గారికి దాఖలుచేయవలెను. జిల్లా విద్యాశాఖాధకార్లు వారిచే శాంక్షను చేయబడి మూసివేయబడిన అక్కవుంట్లు విషయములో అనుబంధము "డి" ప్రకారం అనుమతింపబడిన నమూనాలో ఒకరి జిష్టరునియమించి, వుంచుకోవలెను.

(జె) డిపోజిటర్లయొక్క పోస్టుఆఫీసు ప్యాసుబుక్కులు స్కూలుమేనేజరు, లేక కరస్పాండెంటు అధీనములో నుంచవలెను. ప్రతిడిపోజిటరు సాలీనా (ఆపెషియలు సం॥ రములో) ఒకసారి తనప్యాసుబుక్కుచూచికొని. అందలి నమోదులు సరిగానున్నవని తృప్తిపడినట్లు ఒకసర్టిఫికెట్టు సంతకముచేసి యివ్వవలెను. ఈరూల్సుప్రకారం తీసుకొన్న సర్టిఫికెట్లు డి. ఇ. ఒ. గారికి పంపవలెను' వారు తనిఖీచేసి, వారి ఆఫీసులో భద్రపరచెదరు. ఎలిమెంటరీ స్కూళ్లకు సంబంధించిన ఇట్టి సర్టిఫికేట్లు కేలెండరు సంవత్సరములకు వ్రాయవలెను. (జనవరినుండి డిసెంబరు ఆఖరు వరకు కేలెండరు సంవత్సరమందురు.) **(ఏప్రిల్ 1 తేదీనుండి మార్చి 31 తేదీవరకు అఫీషియల్ సంవత్సరము అందురు.)**

**7. విద్యాలయముల యజమాన్యులచే ఉంచబడవలసిన రిజిష్టరు:—**

స్కూళ్లమేనేజర్లు' లేక కరస్పాండెంట్లు, తమ వద్దపనిచేయు ఉద్యోగియులు సొమ్మును నిలవచేసి కొనుటకు యీదిగువ రిజిష్టర్లు నియమించవలెను.

(ఎ) ఫండుకు చందాను చెల్లించు చందాదార్ల పేర్లను మాపునట్టి అనుమతింపబడిన అనుబంధము "బి" నమూనాలో చెప్పబడిన ప్రకారము, ఒక కౌర్డుకేటలాగున్ను (బి) ఫండునుండి శాంక్షనుఅయిన అడ్వాన్సులున్ను, తిరిగి చెల్లించుటలున్ను. చూపు నట్టి-నియమింపబడినట్టిన్ని అనుబంధము "ఇ" నమూనాలో చెప్పబడి నట్టిన్ని - కాలములు గల ఒక రిజష్టరున్ను.

(సి) స్కూలువిడిచిన చందాదార్ల యొక్కయు ఫండుకువారిచే చెల్లింపబడిన మొత్తముల సర్టిఫికేట్ల యొక్కయు, జిల్లావిద్యాశాఖాధికారి శాంక్షనుచేసిన అక్కవుంట్ల ట్రాన్సుఫరు విషయములు నమూదు చేయుటకై అనుబంధము "సి" ఫారంలో చెప్పబడిన ప్రకారము ఒక రిజిష్టరున్ను.

(డి) చందాదార్లు ఫండుచెల్లించుట పూర్తిగా మాని నట్టిన్ని, వారి అక్కవుంట్లు పూర్తిగా మూసి వేసినట్టిన్ని, ప్రభుత్వ కంట్రిబ్యూషనుగూడా పూర్తిగా చెల్లింపబడినట్టిన్ని, చందాదార్ల పేర్లను తెలియ జేయు అనుమతించిన అనుబంధము "డి" నమూనాలో చెప్పబడిన ప్రకారము ఒకపుస్తకమున్ను.

**8. సొమ్ముదాచుకొను వారికి (డిపాజిటర్లకు) వడ్డీ :—**

తపాలాకచేరి సేవింగ్సుబ్యాంకు డిపాజిట్లకు, అప్పుడప్పుడు వాడుచేయు మార్పులతో నిర్ణయించు వడ్డీరేటు ప్రకారమే యీ చందాదార్లకు గూడ వడ్డీ యివ్వబడును.

**9. డిపాజిట్లుసొమ్ము తీసికొని మరియొక దానిలో నిలవచేసుకొనుట ;—**

(ఎ) ప్రతి చందాదారుని యొక్కయు పోస్టాఫీసు బ్యాంకు అక్కవుంటు నిలవసొమ్ము, వారి కిష్ట మున్నచో పోస్టాఫీసు సేవింగ్సుబ్యాంకు నిబంధనల ప్రకారము, అనుమతింపబడిన విధమున. పోస్టాఫీసు షార్టుటరం (తక్కువకాలం) అప్పులుగా యిచ్చుటకుగాని, ఇండియా ప్రభుత్వమువారి యితరజామీను అప్పులుగా యిచ్చుటకుగాని, (పోస్టాఫీసు సేవింగ్సు క్యాషుసర్టిఫికెట్లు మున్నగునవి కొనుటకుగాని, తీసి నిల్వచేసి కొనవచ్చును. అటువంటి సందర్భములలో తపాలా, తంతుల అక్కవుంటెంటు జనరల్ గారికి ఆ జవాబు దారీలు-లేక హామీలు - విడువబడును. ఆయన 49 వ సేవింగ్సు బ్యాంకు నిబంధన ననుస రించి, బాకీయున్న వడ్డీ తేల్చి, నిలవదారు అక్కవుంటు మొత్తములో కలిపివేయ వలసినదని అందుకు సంబంధించిన పోస్టాఫీసుకు సలహానిచ్చును.

(సశేషము)




'చిరంజీవి'

## గాడిద - కుక్క

సరిగ నాదర ముంపని దొర గృహమున
దొంగ చొర నూరకొనె కుక్క; ముంగిటగల
గాడిదయు నోండ్ర పెట్టె; నిక్కము నెఱుగక
నిదుర చెడ వాడు గాడిదఁ జిదుక మోదె

## చీమ - పావురము

నీట నొక యాకు వైచి తన్నివల కీడ్చి
కాచుపావురమును వేటకాఁ డొకండు
బాణమున చంపనుండగాఁ బదము కరచె
చీమ; – గురితప్పె; – పిట్టయు చెదరి బ్రతికె.

## కాకి - పాము

తనదు బిడ్డలఁ దినెడి పామును వధింప
కాకి యూహించి;- రాణి నగను హరించి;-
పుట్టలో వేయ–సేవకుల్ మట్టిఁ ద్రవ్వి
సర్పమును జంపి నగఁ గొని చనిరి మరల.

## కోతి - రెండుపిల్లులు

దొంగిలిన రొట్టె పంచుకొనంగ లేక
కోతికడ కేగ తక్కెడఁ గొని యదియును
ముక్కలను పెద్ద చిన్న యంచొక్క టొకటి
తినియె; పిల్లులు రెండును చనియె నేడ్చి.

## వర్తకుడు - టోపీలు

వర్తకుడు నిద్రఁ గొనుతఱి వానరములు
చనియె టోపీలఁ గొని; వాఁడు కని మెలకువ
చూచి యోచించి తనటోపి చాచి విసర
నవియు విసరె; వా డవియేరి యవలఁజనియె.

## ముంగిస-బ్రాహ్మణకాంత

బిడ్డపై కేగు సర్పంబు పీక కొఱికి
రక్త మంటు ముంగిస విప్రరమణి చూచి
నిక్క మెఱుగక "నాబిడ్డ నిది వధించె"
నంచుఁ గడవను తల వ్రేయ; నరచి చచ్చె.

## మాటా - చేతా

మా మా టొక్కటి నీటుగా
చేతొక్కటి షోకుగా
మాటకు చేతకు దూరము
మైలు లుండు మధ్యగా.
మాటేలా చేతలేక
చేతేలా మాటలేక
మాటకు చేతకు కలయిక
మానవ విధి చాలా.
మాటచెప్పి చేసిచూపు
చేసిచూపి మాటచెప్పు
మాటలు చేతలు ఒకటను
మర్యాద గడింపవోయ్ !

## పులి - బ్రాహ్మణుడు

పులి యొక్కటి చెరువుదరిని
నిలిచి కడియ మొకటి బట్టి
పిలచె దారిపోవు నొక్క
పిలకబాపనీ !
ఏమయ్యా ! పంతులయ్యా !
ఈ స్వర్ణపు కడియ మయ్యా

సాధు వోకని యాజ్ఞవలన
శాస్త్రుల కీవలె నయ్యా!
చనవయ్యా! చెరువులోన
స్నానమాడి రావయ్యా!
కోనవయ్యా దీని నీవు
వెనుక కేను చనుదయ్యా!
బాపం డా మాట లెల్ల

పాపము నిజమని నమ్మి
పాడు మడుగులోన కేగి
పడి చిక్కెను బురదలోన
అయ్యయ్యో బాపనయ్య
అడుసుని చిక్కితి వటయ్యా
అనుచు పులియు దరికి బోయి
అతని మ్రింగెనూ.

---

## కావాలోయ్! కావాలి!

పాపకు పాలు
బట్టకు నూలు
రాజుకు వాలు
కావాలోయ్! కావాలి! 1

ఊరికి చెరువు
తోటకు ఎరువు
మనిషికి పరువు
కావాలోయ్! కావాలి! 2

జాతికి ఐక్యత
డబ్బుకు భద్రత
పురుషునకు శూరత
కావాలోయ్! కావాలి!

బాలురకు వృత్తివిద్య
యువకులకు ఉన్నతవిద్య
ప్రజలకు ఆంధ్రరాష్ట్రప్రారంభవిద్య
కావాలోయ్! కావాలి!

—కె. వెంకటరెడ్డి.




## ఎయిడెడ్ ఉపాధ్యాయుల కష్టాలు !

ప్రతి నెలా ఉపాధ్యాయులకు 10 తారీఖులోగా జీతములు యివ్వవలసినదిగా ఉత్తర్వులుమాత్రం ప్రభుత్వం ఆదేశించినది కాని ఎప్పుడూ కూడ సక్రమముగా అందచేయుచున్నట్లు కనపడదు. ఇటీవల నవంబరు నెల జీతం జనవరి నెలలో యివ్వమని ఉత్తర్వులు వచ్చాయట. ఆ కొద్దిజీతాలైనా ముట్టేసరికి ఫిబ్రవరి 2 వ వారం దాటిపోయిందిలెండి! ఇతర డిపార్టుమెంటులలో పనిచేయువారు ప్రతి నెలా 1 తారీఖునకు జీతం తీసుకొనే అధికారులే చాలా యిబ్బందిపడుచున్నట్లు చెప్పుతారు. ఆ ఒకటవ తారీఖు ఏ ఆదివారమో అయితే వారిబాధ చెప్పనలవికాదు పాపము! సంక్రాంతిపండుగకు యిస్తామనితలచిన జీతాలు ఫిబ్రవరినెలలో ముట్టినవిలెండి. అదీ కొంత మెరుగే. డిశంబరు నెల జీతం యింత వరకూ రాలేదు. మార్చి నెలలో వస్తాయని వినికిడిగా యున్నది. ఉపాధ్యాయుల జీతాలు ఎప్పుడుపంపితే యేమనికాబోలు! జనవరి నెల జీతాలు మార్చి నెల 10 తారీఖునకు అందవలసియున్నది. కాని డిశంబరు నెల జీతాలు మార్చిలో వచ్చినచో, జనవరి నెల జీతాలు ఏప్రియల్ నెలలో వచ్చును. చూచారా! మన అధికారుల శ్రద్ధ ఎంతగానున్నదో? విదితమగుచున్నది. అదనపుపనికి మరో గుమాస్తాను కూడా యిచ్చియున్ననూ, జీతములు సకాలములో ముట్టుటలేదు. పాపము! ఉపాధ్యాయులు సంక్రాంతి రోజులలో ఉపవాసాలతో వెళ్ళబుచ్చినారు. అధికారుల బొజ్జలు నిండినవిగదా? వీరలసంగతి ఎందుకు అని మరచినారు. తమ జీతభత్యాలు సకాలములో ఎట్లు పొందుచున్నారో, అట్లుగానే ఉపాధ్యాయుల జీతములుకూడా సకాలములో ముట్టునట్లు చూచుట వారి బాధ్యతని గుర్తించాలి.

1. ఉపాధ్యాయుల ప్రావిడెంటుఫండు మేనేజర్లు కట్టువంతుకూడా ప్రభుత్వమేకట్టాలి. ఎయిడెడ్ ఉపాధ్యాయుల పిల్లలకు ఉన్నతవిద్య ఉచితముగా నేర్పవలెను. పరీక్షా రుసుములు మినహాయించవలెను.

2. పంచాయితీ మునిసిపల్ ఏరియాలలో నున్న ఎయిడెడ్ పాఠశాల ఉపాధ్యాయులకు ఇంటిఅద్దెలు యిప్పించవలసియున్నది.

3. యింతవరకు మేనేజర్లు యివ్వవలసిన రు. 3 లు మేనేజర్లు యివ్వక, యిచ్చినట్లుగా సంతకములు తీసుకొనుచున్నారు. గాన ఆ 3 రూ॥లు ప్రభుత్వమే యిప్పించి మేనేజర్ల బ్లాకుమార్కెటు వ్యాపారమును అరికట్టవలెను. కేంద్రప్రభుత్వమే సదరు స్కూళ్ళను స్వాధీనపరచుకొని, సెలవులు, ఇతర మైనవిధులు, వీరికికూడా ఏర్పరచవలెను.

4. ప్రభుత్వమెంతగా రూల్సు మార్చినా, మేనేజర్లు వారికి రావలసిన పర్సెంటేజి ప్రభుత్వమిచ్చినా ఇంక ఖర్చులకని ప్రతి మేనేజరు రు. 2 లు లగాయతూ 8 రూ॥ల వరకు జీతంనుంచి తీసుకొనుచున్నారు. ఈ వ్యాపారము అరికట్టవలెను. ప్రభుత్వము ఉపాధ్యాయులు వివిధమేనేజిమెంట్లులో నున్నవారి కందరికి ఒకేస్కేలు యిచ్చుటకు ఆలోచింపబడుచున్నదని నుడివినది సంతోషింపదగినది. కాని అట్లుయిచ్చు జీతము బ్లాకుమార్కెట్టులోకి పోకుండా నేరుగా ఉపాధ్యాయుల చేతిలోనికి వచ్చునట్లుచూచుట అధికారులపని యని తలంచకుండుట చాల విచారకరము. ప్రాథమికపాఠశాలలు ప్రభుత్వమువారు 220 రోజులు పనిచేసినచాలునని, తక్కువ కూడదని ఏర్పరచిరి. కొన్ని పాఠశాలలు సంవత్సరములో పనిచేయవలసినదినములేకాక ఎక్కువ దినములుకూడ పనిచేయుచున్నవి. అదనపు పని దినములకు మేనేజర్లకు యిచ్చు గ్రాంటునుండి అదనపు పనిచేసిన రోజులకు జీతములు యిప్పించవలెను. కాంగ్రెస్ అధిష్ఠానవర్గము బీద ఎయిడెడ్ ఉపాధ్యాయులయందుకూడ తమదృష్టినిబఱపి పాఠశాలోపాధ్యాయుల జీతములు త్వరగా ముట్టునట్లు జూడగలందులకు ఈ లేఖద్వారా ప్రార్థించుచున్నాను.

— శ్రీ చక్రవర్తి - ఏలూరు.

# ఆంధ్రయువకా! లెమ్మురా!

రచయిత : స్వరాజు శ్రీ వేణుగోపాలరావు పంతులు, మునుగోడు

౧. ఆంధ్రయువకా లెమ్మురా! ఆంధ్రయువకా లెమ్మురా!
ఆంధ్రభాషను వృద్ధిచేయగ
ఆంధ్రకళలను పెంపుజేయగ
ఆంధ్ర తేజము దేశమెల్లెడ
సాంధ్రపరుపగ లెమ్మురా!
ఆంధ్రయువకా లెమ్మురా॥ఆం॥

౨. తిక్కనాది మహాకవీంద్రులు
చక్కనౌ మన తెల్గుపీటను
నిక్కముగ జనియించినా రని
ఢక్కవేసుక జాటరా! చెక్కు
చెదరని మాటరా! ॥ఆం॥

౩. బాలచంద్రుం డాదిగా గల
బాలశూరులకీర్తి జగతిలో
తేలియాడిన దంచు తెల్గుల
మేలు మహిమలు దెల్పరా! ఆల
వాలము నిల్చురా! ॥ఆం॥

౪. పాపరాయని వెలమపౌరుష
కోపజ్వాలల విజయచిహ్నము
స్థాపితం బని తెలుగునాటను
ఊపి శంఖము ఊదరా దాపులేకను
బల్కరా! ॥ఆం॥

౫. ఏడనో గల దేశవీరుల
వాడి కుస్తీలందు గెలచిన
కోడెరాముడు తెలుగువా డని
నాడునాడుల జాటరా! కూడి వీరత
గాంచరా! ॥ఆం॥

౬. కాకతీయుల విజయభేరిచే
సోకుగా గల మగటివీరుల
మోకరింపులు గొనిన రుద్రమ
తీకుతాకులు చెప్పరా! స్త్రీకి స్థానము
యివ్వరా! ॥ఆం॥

౭. కలికురాళ్లను క్షణములోపల
కరుగజేసిన త్యాగయార్యుడు
పరమభక్తుడు ఆంధ్రుడే యని
గురుతు తెల్పుచు పాడరా
చురుకుదనమును జూపరా! ॥ఆం॥

౮. "దేశభాషల తెలుగులెస్సని"
కౌశలంబున తెలియ బల్కిన
ఈశుడౌ శ్రీకృష్ణరాడ్భూ
మీశుడే యని బల్కరా! లేశ మిదియన
బోకురా! ॥ఆం॥

౯. దాత యతడని కలియుగంబున
ఖ్యాతి జెందిన భాస్కరార్యుని
పూత చరితము తెలియపర్చగ
చేత ఘంటము బూనరా జాతి
ధర్మమూ వ్రాయరా! ॥ఆం॥

౧౦. హాలము కలమును చేత నిడుకొని
చలములేకను గేస్తుధర్మము
సలిపె పోతనభక్తు డిమ్మహి
తెలుగువా డని వ్రాయరా! కలిమి
లేములు కళలురా! ॥ఆం॥

౧౧. సెడ్డి కట్టినదాది భోగగ
ఎడ్డెపనులను జేసి సుఖములు
మడ్డివే యను వేమనార్యుడు (ఈ)
గెడ్డవా డని బల్కరా! దొడ్డ తెలుగుల
బిడ్డడా! ॥ఆం॥

౧౨. ఆంధ్రులము మేమంత మాదౌ
ఆంధ్రరాష్ట్రము పంచియిం డను
ఆంధ్రవీరుల కండగా తగు
సాంధ్రనిష్ఠనుబూనరా! ఆంధ్ర
రాష్ట్రము గోరరా! ॥ఆం॥

# ఉపాధ్యాయ మిత్రులకు విజ్ఞప్తి

ఉపాధ్యాయ మిత్రమా ! నేనుగూడ ఒక ఉపాధ్యాయుడనే గాన ఉపాధ్యాయు లందరకు నామనస్సునందున్నటువంటి ఉద్దేశమును వెలిబుచ్చుటకై సాహసించి, కలమును చేబట్టి ఈ చిన్నవిషయమును మీకెల్లరకును తెలియజేయుచున్నాడను.

నేను 1945 సం॥ ట్రైనింగు అయితిని అప్పటికి నాకు వయస్సు 18 యేండ్లు విజ్ఞానము బహుతక్కువ ధైర్యము శౌర్యము పదుగురిలో మాట్లాడవలెనన్నను భయపడెడివాడను ట్రైయినింగు శిక్షణ పొందినను పిల్లలకు ఎట్లు విద్యాప్రబోధము చేయవలెనో యను విషయమునందుకూడ భయపడుచుండెడివాడను. ఉద్యోగమును నిర్వహించుచు, ఉపాధ్యాయుల సెంటరు క్లాసులకు హాజరగుచు, శ్రీ ఇనస్పెక్టరుగార్ల సలహాలు వింటూ, వస్తూయున్నప్పటికిని నాకు భయముపోలేదు. కాని ఇటీవల సెంటరు క్లాసునందు ఒక ఉపాధ్యాయుని చేతిలో "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" యను మాస పత్రికను చూచి తీసుకొని చదివితిని, వెంటనే ఆపత్రికకు చందాదారునిగా చేరవలెనని నిశ్చయించుకొని, 1947 సం॥ న 1 రూపాయి చందా పంపగా ఆసంవత్సరమంతయు నాకు పత్రికవచ్చెను. అందలి విషయములు చదువుతూ ఉంటూ వుండగా బడిపిల్లలకు ఎట్లు విద్యాప్రబోధము చేయవలెనో యను విషయములును, గ్రామస్థులతో నెట్లు స్నేహసంబంధములు కుదుర్చు కోవలయునో యను విషయములును, ఇనస్పెక్టరతో ఏవిధముగా మెలగవలయునో యను విషయమును, ఆపత్రికద్వారా నాకు తెలియవచ్చినవి. అందువల్ల నేటికిని నేను ఆపత్రికను తెప్పిస్తూ, అందున్న సంగతులను ఇతరలకు వినిపిస్తూ, యితరుల కనేకులకు ఈ పత్రికలయొక్క ఉపయోగములు చెప్పుచున్నాడను. గాన తోటి సోదరోపాధ్యాయులందరు మన తరపున వెలువడుచున్న ఈ "ఆంధ్ర రాష్ట్ర ప్రారంభవిద్య" యను పత్రికను ఆదరించి అన్ని విధములా పైకి తేవలెనని మనవి చేస్తున్నాను.

మీ ఉపాధ్యాయ సోదరుడు,
సి హెచ్ జేసురత్నం,
జి డి. యం. స్కూలు.

మల్లవరం,
26—3—1952.

---

## ** వివేక ప్రశ్నలు **

అక్షరములు నాల్గు – అవని కర్థంబగు;
బుద్ధిమంతు డగును – మొదలు చెఱుప;
చివరి రెండుజేరి – శేముషి కొప్పును;
అట్టి పదము దెలిపి – యశము గొనుడు.

అల్లంరాజు బంగారం,
టీచరు-కొంతంగి.

ఒక్కపురము పేరొప్పు నైదక్కరముల;
ఒకటి మూడైదు చేర్చిన నొప్పువైరి;
ఆది చివరలు గలిపిన నధికమగును;
తెలుగు కీర్తికి నెలవది తెలిసి చెపుడు.

చీమలమఱ్ఱి వెంకట్రామయ్య,
టీచరు-కుంచేపల్లి.

# మార్చినెల చిత్రప్రశ్నలు

(1952 సం॥ మార్చినెలసంచికలో ప్రకటింపబడిన)

## వివేకప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు జవాబులు

**౧. గానుగ. ౨. తెలకలిఎద్దు.**

రెండుప్రశ్నలకు సరియైనజవాబులు పంపినవారు—

చందా నెం.

345 బి. నరసయ్యగారు - కార్యదర్శి - కేంద్రోపాధ్యాయసంఘము - రైల్వేకోడూరు
458 అల్లంరాజు సూర్యారావుగారు - హెడ్మాష్టరు - శృంగవరము
521 అల్లంరాజు బంగారంగారు - టీచరు - కొంతంగి
291 అరసాడ జగ్గారావు పట్నాయక్‌గారు - మేనేజరు - త్సలివెంద్రి
9 కేగిడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం
372 దోశల తమ్మిశెట్టిగారు - టీచరు - కింతలవానిపేట
571 భానూరు సత్యనారాయణపట్నాయక్‌గారు - హెడ్మాష్టరు - అవలంగి
270 భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిశ
140 టి. సత్యగోపాలాచార్యులుగారు - టీచరు జి. టి. స్కూలు - అనంతపురం
642 కొప్పిశెట్టి వెంకటరెడ్డిగారు - టీచరు - మేనేజరు - గంగలకుర్రు
526 పి. అప్పారావుపట్నాయక్‌గారు - టీచరు మేనేజరు - ?
569 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మెయిద
111 దుంపరామమూర్తిగారు - టీచరు - చింతపల్లిపేట
55 పి. సూర్యనారాయణపట్నాయక్‌గారు - టీచరు - మేనేజరు - చింతపల్లిపేట
96 ఆర్. సుబ్రహ్మణ్యంపంతులుగారు - గంగలకుర్తి అగ్రహారం
620 సి హెచ్. వి. సుబ్బయ్యగారు - హెడ్మాష్టరు - పెదఓగిరాల
565 టి. రంగయ్యగారు - హెడ్మాష్టరు
327 పి. వి. పట్నాయక్‌గారు - హెడ్మాష్టరు - రాజాం
248 యం. సూర్యనారాయణగారు - టీచరు - ఓ.డ.చీపురుపల్లి
441 కణితి కౌరునాయుడుగారు - ముద్దపువానిపేట
108 యం. గంగాధరంశెట్టిగారు - టీచరు - నల్లచెరువుపల్లె
213 పి. నారాయణనాయుడుగారు - పెదమేడపల్లి
420 అల్లూరి అప్పలరాజుగారు - టీచరు - వెలివర్రు
659 కె. యల్. నారాయణప్పగారు - టీచరు - న్యామద్దల

మొదటి ప్రశ్నకు మాత్రమే—

457 డా॥ చక్రాల తిరుపతిరాజుగారు - టీచరు - రామచంద్రపురం - గుంటూరుతాలూకా
337 అమరపు సత్యనారాయణగారు - పాములవలస
525 కె. రామన్నగారు - రిటైర్డుటీచరు - కోడుమూరు

రెండవ ప్రశ్నకు మాత్రమే—

468 రేగులవలస సత్యనారాయణగారు - మేనేజరు - గారాజు చీపురుపల్లి
269 పల్లస్వామినాయుడుగారు - హెడ్మాష్టరు - గొలుగువలస
19 సిహెచ్. రంగారావుగారు - జి. టి. స్కూలు - శ్రీకాకుళం
శ్రీమతి యస్. యల్. నరసమ్మగారు - మిస్ట్రెస్ - ఇచ్ఛాపురం

---

# ఆహ్వానము



## శ్రీమదాంధ్రభాగవత సప్తాహము, పినపాడు, తెనాలి

సోదరులారా!

1952 జూనునెలలో పినపాడులో నా స్వగృహమందు శ్రీమదాంధ్ర భాగవత సప్తాహము, నామసప్తాహముతో జరుప పెద్దలు ఆశీర్వదించి యుండిరి. కాన ఎల్లరును దయచేయ ప్రార్థించుచున్నాను. ఈ కార్యక్రమముతోపాటు ప్రాథమికోపాధ్యాయులలో ఎవరైనను హరికథలు, ఉపన్యాసములు, పాటకచ్చేరీలు, కవితాగోష్ఠి మొదలగు కార్యక్రమములలో పాల్గొనదలచువారు ఎవరెవ రెందులో పాల్గొందురో మేనెలాఖరులోగా తెలియపరచిన సరిఅయిన కార్యక్రమమును నిర్ణయించి అందరికిని అందజేయగలను, స్త్రీ, పురుషులు, బాలురు, పాల్గొనవచ్చును.

తెనాలీ,
ది 7–4–52.

ఇట్లు,
భవద్విధేయుడు.
కంచిభొట్ల శివరామయ్య,
సాలిపేట హిందూఎలిమెంటరీస్కూలు.

---




# జన్మదిన సందేశము

"ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" కు నలుబదియేండ్లు నిండినవి. నలుబది ఒకటవయేడు ప్రారంభమైనది. ఈజన్మదిన శుభసమయమున మాపత్రికామతల్లికి శుభాకాంక్షలు పంపినవారికి, మాపత్రికపట్ల ఇంతకాలము నుండి పెక్కు తెలుగుల నాదరాభిమానములు చూపుచున్నవారికి, మాకృతజ్ఞతాపూర్వకధన్యవాదములు, మాపాఠకులకు, మారచయితలకు, మాప్రోత్సాహకులకు, సమస్త సోదరోపాధ్యాయులకు, విద్యార్థి చిరంజీవులకు, నందన వత్సరము సుఖానంద సంధాయకమగుగాక!

ఈజన్మదిన శుభసమయమున ఉపాధ్యాయలోకమునకు మాదొక సందేశము.

కడచిన నలుబది యేండ్లనుండి మా "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" ప్రాథమిక విద్యా ప్రచారమునకే కృషిచేయుచున్న సంగతి దేశికలోకమునకు తెలియని విషయముగాదు. ఒక్క ప్రాథమిక విద్యావ్యాప్తికేగాక ప్రాథమికోపాధ్యాయ కష్టనివారణకు గూడ ఈపత్రిక పాటుపడుచున్న సంగతి తెలియనిదీకాదు. అయినను ఉపాధ్యాయలోకమునకు దీనిపట్ల తగినంత యాదరము లేదని చెప్పవలసి వచ్చుటకు మేమెంతో కష్టపడుచున్నాము.

అసలు పత్రికానిర్వహణము అంతంత వారికి అందుబాటులోనిదికాదు. ఆర్థికపుష్టి లేనిది-కార్యోత్సాహ మెంతయున్నను-పత్రికను సక్రమముగా నడపుట సాధ్యముగాదు. ఆరంభశూరత్వమును ప్రకటించుచు, మనకన్నులయెదుట ఎన్నెన్నో పత్రికలు పుట్టుచు, పురుడైన వెళ్ళకమునుపే సందుగొట్టి పోవుచున్నవి. మఖలో పుట్టి పుబ్బలో మాయమైన పత్రికలు మనకెన్నో తెలియును. దీని కంతకు మూలకారణము ఆర్థికపుష్టి-అనగా స్వయంపోషకత్వము-చాలక పోవుటయే. ఇది బహిరంగ రహస్యము.

ఇట్టి పరిస్థితిలో ఉపాధ్యాయలోకమున కంకితమైన మా "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" ఈ నలుబదియేండ్లనుండి-కుంటుదనము లేకుండ-ఎట్లునడుపబడు చున్నదో ఇంచుక యోచింప గోరెదము.

నిజమునకు మాపత్రికకు నేటివఱకు గూడ స్వయంపోషకత్వము లేదని చెప్పుటకు చాల విచారపడుచున్నాము. "తలంత బలగమున్నది - నాయనువారొక్కరు లే"రన్నట్లున్నది మాపత్రికపరిస్థితి,

ఆంధ్రరాష్ట్రమున ప్రాథమికోపాధ్యాయులు వేలకొద్ది యున్నారు. ఈయందఱికి

"ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" కావలసినదే. అందఱి మేలుకొఱకు ఇదిపాటుపడునదే. అందఱియభిమానమును అర్థించునదే. కాని పట్టుమని వేయిమందికూడ లేరు-ఈపత్రికను అభిమానించి ఆర్థికముగా సహాయపడు దేశికులు ఆర్థికముగా అన్నంతనే కొండంత బరువుగా గణించవద్దు. సంవత్సరమునకు ఒక్కరూపాయి మాత్రమే. ప్రాథమికోపాధ్యాయులు-నిజానికి-ఆర్థికముగా చాలదుస్థితిలో నున్నారని ఒప్పుకోక తప్పదు. వారిజీవన భృతికే వారి జీతము చాల్లదని చెప్పకతప్పదు. అయినను చంద్రునకొక్కనూలు పోగన్నట్లు-ఉడుతాభక్తియన్నట్లు-గానుగలోదే గంటెడన్నట్లు సంవత్సరము పొడుగునా తమ మేలుకొఱకు పాటుపడునీపత్రికకు ఒక్కరూపాయి సంవత్సరపుచందాయిచ్చి, తోడుపడుట అంత బాధకరముగా తోపరాదని మా ప్రార్థన.

ఉపాధ్యాయుల ఆర్థికదుస్థితినిగుర్తించియే యెన్నికష్టములెదుర్కొన్నను, యుద్ధ పరిస్థితులు కాగితపుకాటకమును తెచ్చిపెట్టినను, ప్రతిసంవత్సరము నష్టము తప్పని సరియగుచున్నను, కేవలము విద్యాప్రచారమే పరమావధిగనిశ్చయించుకొని, చందా ధనమును పెంచక, యే అవాంతరములు వచ్చిపడినను పత్రికా ప్రకటనము నాపక, యింతవఱకు క్రమముగనే నడుపగల్గుచున్నాము, కాని యెంతకాలమని యీ చాలీచాలని బ్రతుకు? ఎప్పటికి స్వయం పోషకముగా రాణించగలుగుట? ఈసమస్యల నేడుపాధ్యాయలోకము పరిష్కరింప వలెను.

ఈవత్సరారంభమున సర్వాంగసుందరముగ -వ్యాసకర్తల ఫొటోలతో ఉగాదిసంచికను ప్రకటింపవలెనని యెంతో అనుకొన్నాము. కాని యీఒక్క సంచికకే మాకు ప్రస్తుతము వచ్చుచున్న సంవత్సరపు చందాధనమంతయు సరిపోవునట్లుగా తేలినది. అందువల్ల ఈపనికి పూనుకోలేక పోయినాము.

నిజానికి నలుబదియేండ్లనుండి అవిచ్ఛిన్నముగా నడుపబడుచున్న యీ పత్రికకు ప్రతిసంవత్సరము ఉగాది సంచిక లేకపోవుట చాలవిచారకరమైన విషయము. కానియేమి చేయగలము? మింగటానికి మెతుకు లేదు-మీసాలకు సంపెంగనూనెయా? అన్నపరిస్థితి యేర్పడినది. కాబట్టి యీవిషయములన్నింటినీ పరికించి, పరిగణించి, ఆంధ్రరాష్ట్రమున గల యుపాధ్యాయులెల్లరు ఈపత్రికకు చందాదారులుగా జేరి, స్వయం పోషకత్వమును సమకూర్చుటయేగాక-ఇక ముందు ప్రతిసంవత్సరము ఉగాదిసంచికతో సర్వాంగసుందరముగా ఇది ప్రకటితమగుటకు తగినంతగా తోడ్పడగలరని ఆశించుచున్నాము.

ఉపాధ్యాయలోకము మాపత్రికా జన్మదిన సందేశము నాలకించుగాక! జై హింద్!

సంపాదకుడు.






## గౌరవనీయులైన మద్రాసు శాసనసభా సభ్యులకు

ఆత్మకూరు తాలూకా, బోర్డు ప్రాథమికోపాధ్యాయ యూనియన్ సమర్పించుకొన్న మెమొరాండము నందలి ప్రధానాంశములు :—

1. జీవితావసరభృతి:—కేంద్ర వేతన నిర్ణాయక సంఘ నివేదిక ప్రాతిపదికపై కనీస జీవితభృతి కలిగించు విధముగ ప్రాథమికోపాధ్యాయుల జీతముల స్కేళ్లను నిర్ణయించుట—(ii) సదరు నిర్ణయ సందర్భమున సర్వీసుగల టీచర్లు యింతవరకు పొందియుండు ఇంక్రిమెంట్లను నూతనముగ నిర్ణయింపబడనున్న స్కేలునందలి మినిమము మొత్తమునకుచేర్చి అట్టివారి జీతము నిర్ణయించుట—(iii) ఒక యోగ్యతగల టీచర్లు ఒక మేనేజిమెంటుక్రింద అర్హతగల స్థానములలో—ఎలిమెంటరి స్కూళ్ళలో పనిచేసినను—సెకండరీ స్కూళ్ళలో పనిచేసినను—వారి జీతములయందు వ్యత్యాసము లేకుండ జేయుట.

2. జబ్బుచేసినపుడు నిండు జీతముపై శలవు మంజూరుచేయుచు వైద్య సౌకర్యమునకై ప్రత్యేక అలవెన్సు మంజూరు చేయుట.

3. ఉపాధ్యాయుల బిడ్డలకు సెకండరీ స్కూళ్ళలోను, కాలేజీలలోను, ఉచిత విద్యా సౌకర్యముల కలిగించుట.

4. జిల్లాబోర్డులు మున్నగు యాజమాన్య సంఘములందు ప్రాథమికోపాధ్యాయులకు ప్రాతినిధ్యము కలిగించుట.

5. మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు ఉపాధ్యాయ నియోజకవర్గమునకు ఓటుచేయు హక్కును ప్రాథమికోపాధ్యాయులకు కలిగించుట —

6. స్వతంత్రభారత భావిపౌరులను తయారుచేయవలసిన యావన్మంది టీచర్లను స్వేచ్ఛా పౌరులుగ అన్ని ప్రజాసంస్థలకు ఎన్నికలలో పోటిచేయుటకును, పాల్గొనుటకును, వసతి కలిగించుట —

ఈ కనీసపు కోర్కెలను ప్రభుత్వముచే నంగీకరింపజేయ విజ్ఞప్తి చేయుచున్నది.

వాసిలి,
ది 22—3—52.

సి. వి. రంగయ్య,
అధ్యక్షుడు.

## వార్షికోత్సవసభలు

ఏలూరు :

ఏలూరు మ్యునిసిపల్ ప్రాథమికోపాధ్యాయ యూనియన్ వార్షికోత్సవము ది 8-3-52 శనివారం సాయంత్రం 3 గం॥ లకు మొదలు 5 గం॥ల వరకు పవరుపేట రైల్వేస్టేషన్ మ్యునిసిపల్ హయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో, ఛైర్మన్ శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారి అధ్యక్షతక్రింద జరుపబడినది.

మహాసభా తీర్మానములు :

1. ఎలిమెంటరీస్కూలు ఉపాధ్యాయులకు వృత్తిపన్ను సం॥నకు రు 2-0-0 లు తీసుకొనుచున్నారు. గాన ప్రాథమికోపాధ్యాయులకు వృత్తిపన్ను తొలగించమని యీ సభవారు అధికారులను కోరుచున్నారు.

2. వేసవిశెలవులు 1 నెలమాత్రము యిచ్చిరి. బెజవాడ మ్యునిసిపాల్టీలో 7 వారములు యిచ్చినటుల యిక్కడకూడ యిప్పించవలయునని యీ సభవారు తీర్మానించు చున్నారు.

3. ప్రాథమిక పాఠశాలలో ప్రాబీషనరు సీనియర్ అగు మగ-ఉపాధ్యాయులను తొలగించి, ఆ స్థానే జ్యూనియరు అగు ఆడ ఉపాధ్యాయినీలను నియమించుట వలన అన్యాయము జరుగుచున్నది; గాన అధికారులు అటులచేయకుండా సీనియర్ అగు మగ ఉపాధ్యాయులను, వుంచగలందులకు యీ సభ వారు కోరుచున్నారు.

4. ఉపాధ్యాయుల బిడ్డలకు ఉన్నత పాఠశాలలో, ఉచితవిద్య గరపించుటకు ఉత్తర్వులను గ్రహించ వలసినదని యీ సభవారు కోరుచున్నారు.

5. 20 సం॥రముల సర్వీసుగల ఎలిమెంటరీస్కూలు ఉపాధ్యాయులకు రు 2-0-0 లు ఇంక్రిమెంట్లు, (Moximam pay) యిప్పించ గలందులకు యీ సభవారు కోరుచున్నారు.

6. సీనియర్ హయ్యర్ గ్రేడ్ టీచర్లు S. S. L. C తో నిమిత్తం లేకుండా సెకండరీగ్రేడు పరీక్షలో కూర్చొనుటకు వుత్తర్వులను గ్రహించగలందులకు యీ సభవారు కోరుచున్నారు.

7. ఎలిమెంటరీ స్కూలులలో పనిచేయుచున్న డ్రాయింగు, క్రాఫ్టు, మొదలైన టెక్నికల్ పరీక్షలు ప్యాసైన ఉపాధ్యాయులను సెకండరీస్కూలుకు తీసుకొనవలెనని కోరుచున్నారు.

8. G. O. ప్రకారము ఎయిడెడ్ స్కూలులలో పనిచేయు ఉపాధ్యాయులు, 60 సం॥రములకు రిటైరు అగు పద్ధతిగలదు. అటులనే స్థానికసంస్థలలో, బోర్డు, మ్యునిసిపాల్టీలలో పనిచేయు ప్రాథమిక ఉపాధ్యాయులకు కూడా 60 సం॥రములకు రిటైరు అగునటుల ను గ్రహించ వలసినదని యీ సభవారు తీర్మానించు చున్నారు.

9. సెంట్రల్, & పేకమీషన్ వారి (Scale pay) అవార్డు అమలు జరుపమని యీ సభవారు తీర్మానించు చున్నారు.

10. ప్రాథమిక హయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలో హిందీ ప్రారంభించ వలసినదని కోరుచున్నారు.

11. అవుసరమున్న తావుల ఎయిడెడ్ స్కూలువారు గాక, మునిసిపాల్టీవారే నూతన పాఠశాలలు నెలకొల్ప గలందులకు కోరుచున్నారు.

12. 1951 సం॥రము గవర్నమెంటు జనరల్ సెన్‌సెస్ వ్రాసిన ఎన్యూమరెటర్లకు, నేషనల్ రిజిష్టర్సు వ్రాసినందుకు రెమ్యూనరేషన్ యిప్పించెదమని శెలవిచ్చిరి. గాని యింతవరకు ఏమియు ఇవ్వలేదు. గాన వెంటనే యిప్పించగలందులకు యీ సభవారు కోరుచున్నారు.

13. సెకండరీస్కూలు టీచర్సు కాన్‌స్టిట్యూఎన్‌సి (Constitu-ency) రిప్రజంటేటివ్, ఎలిమెంటరీస్కూలు టీచర్సుకు, ప్రత్యేక కాన్‌స్టిట్యూఎన్‌సి నెలకొల్పగలందులకు యీ సభవారు కోరుచున్నారు.

14. బుక్కు సెలక్షన్ విషయములో ఎలిమెంటరీస్కూలు ఉపాధ్యాయుల ప్రతినిధిని సెలక్షన్ కమిటీలో ఒకమెంబరుగా గైకొనవలసినదని కోరుచున్నారు.

15. కంటెన్‌జన్సీటీచరు 1 కి రు 0-4-0 చొప్పన యిప్పించగలందులకు కోరుచున్నారు.

16 ప్రావిడెంటుఫండు బోనస్ రూపాయి 1 కి రు 0-2-0 చొప్పనను వడ్డీ 4% చొప్పునను, యిప్పించగలందులకు యీ సభవారు కోరుచున్నారు.

17. సం॥ రమునకు బడిదినములు 220 నుండి 200 దినములకు తగ్గించవలసినదిగా యీ సభవారు కోరుచున్నారు.

ఏలూరు,
8—3—52

ఎస్. బ్రహ్మయ్య,
చైర్మన్ మునిసిపలు కౌన్సిలు ఏలూరు.
డి. శివ రామయ్య,
సెక్రటరీ
మ్యునిసిపల్ ఎలిమెంటరీస్కూలు టీచర్సుయూనియన్, ఏలూరు.

౨. పెద్దాపురం

ది 22-3-52 తేదీన ప్రాథమికోపాధ్యాయ సమావేశము రేంజి టీచర్సు యూనియన్ ప్రెసిడెంటు శ్రీ ఎ. వి. సీతారామారావుగారి అధ్యక్షత క్రిందజరిగెను. ఈ క్రింది మూడు తీర్మానములను సభవారు ఏక గ్రీవముగా ఆమోదించిరి.

1. మునిసిపల్ ఏరియాలో వున్న ఉపాధ్యాయులకు ఇంటిఅద్దె అలవెన్సులు ఇప్పించ వలసినదనియు

2. "టీచర్లు ప్రయివేట్లు చెప్పకొనరాదు అను శాసనమును రద్దుచేయవలసినదనియు.

3. నలుగురికి మించిన ఉపాధ్యాయులు కలిగిన పాఠశాలలలో హయ్యరుగ్రేడు ఉపాధ్యాయులు ప్రధానోపాధ్యాయుడుగా నుండుటకు, 1952 జూలై తరువాతకూడా పనిచేయుటకు, అనుమతించ వలసిన దనియు.

ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

డి. సత్యనారాయణమూర్తి పట్నాయక్,
సంయుక్త కార్యదర్శి రేంజి టీచర్సు యూనియన్

౩. కొవ్వాక :

ఏలూరు తాలూకా - వెస్టు రేంజి సెంటరు వుపాధ్యాయసంఘ ద్వితీయవార్షికోత్సవము

ది 8-3-52 వ తేదీన ఏలూరు వెస్టురేంజి స్కూళ్ళ సీనియర్ డెప్యూటీ యిన్‌స్పెక్టరుగారగు. శ్రీ కె. వెంకటేశ్వర్లు బి. ఎ. బి. యి. డి గారి అధ్యక్షతను. శ్రీ జూనియర్ డెప్యూటీ యిన్‌స్పెక్టరు గారగు. శ్రీ కె. రామకోటేశ్వరరావుగారి సహాయాధ్యక్షతను, కొవ్వాక బోర్డు పాఠశాలలో జరుపబడెను.

పలువురు గ్రామస్థులున్నూ వుపాధ్యాయ వుపాధ్యాయినులున్నూ, బాలబాలికలున్నూ యీ వార్షికోత్సవమునందు పాల్గొనిరి కార్యక్రమం ప్రకారం ప్రార్థన, తదుపరి సెంటరు సెక్రటరి గారిచే సెంటరు నివేదిక, చదువబడెను. ఆ సెంటరులోగల స్కూళ్ళలోని బాల బాలికలచే వివిధనాటకములు, వినోదములు, విచిత్రవిశేషములు జడకోపు, మొదలగునవి ప్రదర్శింపబడినవి.

ఉపాధ్యాయులు పలురకముల చేతిపనులు ప్రదర్శించిరి. ఈ వార్షికోత్సవములో పాల్గొనిన బాల బాలికలకు, వుపాధ్యాయులకు పలురకముల బహుమతులు పంచిపెట్టబడినవి. చేతిపనులు ప్రదర్శించిన వుపాధ్యాయులకు డాక్టరు సి. హెచ్ వెంకటాచలం ఎల్ అయి. యం (మెడికల్ ఆఫీసరు కొవ్వాక) గారున్నూ, కె. ఆర్. కృష్ణానందం (వికేంద్రీకరణం రెడ్డిగూడెం) గారున్నూ ప్రత్యేక బహుమతుల నొసంగిరి. అధ్యక్షులగు శ్రీ డెప్యూటీ యిన్‌స్పెక్టరుగారు ప్రతియేట యీ వార్షికోత్సవము విధిగాజరిపి, సెంటరు అభ్యుదయానికి మార్గదర్శకనుగావలెననియు, వుపాధ్యాయుల బుద్ధి కుశలత చాకచక్యములను వెలిబుచ్చ వలెననియు, తెలిపిరి. తదుపరి అల్పాహారములతోను ఛాయాచిత్రపటము తీయుటతోను, సభ ముగించ బడెను.

8—3—52 }
కొవ్వాక }

ఇట్లు,
యం. కృష్ణమూర్తి,
సెక్రటరీ టి. ఎ. సెంటర్

౪. న్యామద్దల :

22-3-52 తేదీన న్యామద్దల బోర్డు ఉన్నతపాఠశాల సారస్వత వార్షికోత్సవ సందర్భమున నిడే యూరగల వయోజన విద్యాకేంద్రమును. శ్రీ వి. పి. నారాయణరెడ్డి బి. ఎ బి. యిడి. Dt. Ed. Edl. Officer గారు యీ రేంజిస్కూళ్ళ డిప్యూటి ఇన్‌స్పెక్టరు గారైన శ్రీ జి. రామకృష్ణయ్య బి. ఎ, ఎల్. టి గారితోపాటు దర్శించిరి. నాటి వయోజనుల హాజరును, పాఠశాల ఇరువురుపాధ్యాయులచే నిర్వహింపబడు చుండుట సంతోషదాయకమనియు, వయోజనవిద్యా వశ్యకతనుగూర్చి ఆరోగ్యవిధులగూర్చి, సంఘగౌరవ

ప్రాముఖ్యమునుగూర్చి విపులముగా సెలవిచ్చిరి. విద్యావ్యాపకమునందు ఉపన్యాసకుల యావశ్యకతను అందలి విశిష్టతనుగూర్చి శ్రీ Dy Inspector గారు సిరస్కముగానుపన్యసించిరి. మరునాటి సాయంకాలమున ఉన్నత పాఠశాల యావరణమున వహించిన సభలో ఆటల పోటీలలో గెలుపొందినవారికి బహుమతులు పంచుట తోడను 4 మాసములలో అక్షరాస్యత నొందిన 16 మంది వయోజనులకు సర్టిఫికెట్లు జనాబ్ S. M. Ismail Sahib Bhahadar B. A. (Hon) L. T. (Exdivisonal Inspector of Schools గారి ఆధ్వర్యమున పంచబడెను

తుదపరి జనగణ గీతముతో సభ విజయవంతముగా ముగింపబడెను. రాత్రి ఉన్నత పాఠశాల విద్యార్థులచే కళారాధన నాటిక ప్రదర్శింపబడెను.

న్యామద్దల
1—4—52

కె. యల్. నారాయణప్ప
అసిస్టెంటు ఎడల్టు లిటరసి స్కూలు

## పోషక వర్గసభలు

### ౧. వెల్ల :

ది 26-3-52 తేదీన ఈ గ్రామ లైబ్రరీ ద్వాదశ వార్షికోత్సవము జరిగిన సందర్భములో తల్లిదండ్రుల సమావేశము జరుపబడెను. బాలబాలికలను సక్రమముగా బడికి పంపుటలో గల తల్లిదండ్రుల బాధ్యతను గూర్చి పలువురు గ్రామీణులు, ఉపాధ్యాయులు, ఉపన్యసించిరి. ఎయిడెడ్ బాలికాపాఠశాల బాలికలచే ఏకాంకనాటికలు; విచిత్రవేషములు, ప్రదర్శింపబడెను. రాత్రి నేతాజీదళమువారిచే నేతాజీ బుర్రకథచెప్పబడెను. అర్హతగలవారికి బహుమతు లివ్వబడెను.

—సి హెచ్. నరసింహమూర్తి – టీచరు.

### ౨. మల్లవరము :

మా గ్రామపాఠశాల విద్యార్థుల తల్లిదండ్రుల సంఘసమావేశసభ ది 24-3-1952 సం॥ సోమవారము సాయంకాలము 4 గంటలకు ప్రారంభించబడినది పురజనులు, గ్రామాధికారులు, గ్రామమునందు గల బోర్డుప్రాథమిక పాఠశాలల విద్యార్థులు, విద్యార్థినులు, ఉపాధ్యాయినులు, ఉపాధ్యాయులు. కలసి 400 మందికి పైగా హాజరైరి.

1. పతాకవందన గీతముతో సభప్రారంభ మయ్యెను.

2. శ్రీ. సూర్యనారాయణ (కరణము) గారిని అధ్యక్షులుగా ఎన్నుకోవడ మైనది

3. సభయొక్క ఉద్దేశమును గూర్చియు, పాఠశాలాభివృద్ధిని గూర్చియు, ప్రధానోపాధ్యాయులగు శ్రీ. పి. వి. రత్నముగారు ఉపన్యసించిరి.

4. శ్రీ. పి. కుమారరత్నము గారిచే రచింపబడిన "బడికిరాని బాలలజీవితము" అనునాటిక బాలబాలికలచే ప్రదర్శింపబడెను. శ్రీ సి. హెచ్. యేసురత్నముగారు నాటికయందలి సారాంశమును గూర్చి గ్రామస్థులకు విశదీకరించిరి. 3 వ మాష్టరుగారగు శ్రీ బి. సత్యానందముగారిచే నేర్పింపబడిన కోపుచ్చులు మొదలైనవి, నాటిక, విరామ సమయములందు ప్రదర్శింపబడెను.

5. గ్రామాధికారులు బాలబాలికలు ప్రదర్శించిన నాటకమును చూచియు, చిత్ర విచిత్రములైన ప్రదర్శనములను చూచియు, సుమారు 40 రూ॥ విలువగల బహుమానములను బాలబాలికలకు పంచిపెట్టిరి.

6. అధ్యక్షులు విద్యయెడల తల్లిదండ్రులుజూపు అజాగ్రత్తను గూర్చియు, వయోజన విద్యను గూర్చియు, పాఠశాలాభివృద్ధిని గూర్చియు, ఉపన్యసించిరి.

7. ప్రధానోపాధ్యాయుల వందన సమర్పణములోను, జాతీయ మంగళగీతా గానముతోను, నాటి సభముగిసెను.

మల్లవరము,
24-3-1952.

పి. వి. రత్నం. హెడ్మాష్టరు.
బి. డి. యం. ఎలిమెంటరీ స్కూలు,




ది 15—4—1952 మొదలు 14—5—1952 వరకు

మేషరాశి—అశ్విని 4, భరణి 4, కృత్తిక 1వ పాదములు: ఈ రాశివారికి వ్యర్థముగా కాలముగడపుట, స్వల్పప్రయాణములు - జయలాభములు - వృత్తి - ఉద్యోగములలో అభివృద్ధి - అర్థికలాభము - జన విరోధము - స్త్రీకలహములు.

వృషభరాశి—కృత్తిక 1-2-3, రోహిణి 4, మృగశిర 1-2 పాదములు: పుణ్యకార్యచింతన - కార్య ప్రారంభాటంకములు - గృహకలహములు వృత్తి - ఉద్యోగ వ్యవహారమూలక మానసాందోళన - ఋణం - అనారోగ్యం - మిత్రులవలన మోసము - నూతనవస్తు వస్త్రభూషణప్రాప్తి.

మిథునరాశి—మృగశిర 3-4, ఆర్ద్ర 4, పునర్వసు 1-2-3 పాదములు: వృత్తి - ఉద్యోగలాభములు నూతనకార్యావలంబనము, సర్వకార్యప్రారంభాంత్యజయము కించిదనారోగ్యము - ఈశ్వరోపాస్తి సత్కథా కాలక్షేపము - శుభప్రయాణములు.

కర్కాటకరాశి—పునర్వసు 4 వ పాదం, పుష్యమి 4. ఆశ్లేష 4: కార్యాటంకములు ఉద్యోగవృత్తి వ్యాపారములలో అభివృద్ధి - పుణ్యకార్యాచరణం - ప్రయాణములు.

సింహరాశి—మఖ 4. పుబ్బ 4, ఉత్తర 1: గృహసంబంధకష్టములు, కళత్ర శరీర - అనారోగ్యము - ద్రవ్యవ్యయము - లాభనష్టములు - ధనాభావము - మనస్సుకు చీకాకు-పరాకు- గగనదృష్టిప్రసారణ - వివిధ కార్యాచరణాలోచనములు - యత్కించిత్ కదాచిదనారోగ్యము - ఉద్యోగవృత్తియథావల్లాభ ములు.

కన్యారాశి—ఉత్తర 2-3-4 హస్త 4 చిత్త 1-2 పాదములు: ప్రారంభితకార్యాలాభము - ధననష్టము - శత్రు-రోగ-ఋణబాధలు - కనకదుర్గసేవనవల్ల ఆరోగ్య ధనలాభములు - కళత్రరూపేణగాని -బంధు మిత్రులరూపేణగాని సహాయము దైవికయోగముగా జరుగుట మెండు.

తులారాశి—చిత్త 3-4, స్వాతి 4, విశాఖ 1-2-3 పాదములు: కష్టనిష్ఠురములు - ఆప్తవిరోధము-వృత్తి- ఉద్యోగ నూతన ప్రయత్నములు - అశాంతి - స్త్రీలతో కలహములు - ఋణబాధ - తొందర - కార్యనష్టము సంతానమునకు అనారోగ్యము.

వృశ్చికరాశి—విశాఖ 4 వ పాదం, అనూరాధ - జ్యేష్ఠ 4 పాదములు: అనాలోచిత కార్యకలాపములు- త్రిప్పట ప్రయత్న కార్యాటంకములు-వృత్తి ఉద్యమములలో మధ్యమధ్య జయము, వ్యవహార భవిష్య ల్లాభములు - మాసాంత ధనలాభము - మాసమధ్య కుటుంబసంతాన శరీరపీడలు.

ధనూరాశి—మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 వ పాదం: ధనలాభము - పురుషసంతానప్రాప్తి - ఉద్యోగపురోభివృత్తి కార్యాలాభము, ఆరోగ్యప్రాప్తి.

మకరరాశి—ఉత్తరాషాఢ 2-3-4, శ్రవణం 1, ధనిష్ఠ 1, 2 పాదములు: కార్యాలస్యము - కష్టప్రయత్న సాధ్యములు - గృహనిర్మాణ - శుభకార్యాలోచనలు - యావన్మాసము ధనవ్యయము-వృత్తియుద్యమ యథాస్థితి - మాసాంతమందు ఇతోధికముగా కొంత లాభించును.

కుంభరాశి—ధనిష్ఠ 3-4, శతభిషం, 4 పూర్వాభాద్ర 1-2-3 పాదములు: గురుడు మొదలగుగ్రహసంచార లాభమువల్ల ప్రయాస లేకపోవుట - వృత్తియుద్యమాలలో మామూలుస్థితి, కృషులలో అడ్డంకులు. హఠాత్తుగా ధనలాభము - సహాయవర్తకవ్యాపారాలోచనలు. పుణ్యకార్యచింతనము.

మీనరాశి—పూర్వాభాద్ర 4 వ పాదం, ఉత్తరాభాద్ర 4 - రేవతి 4 · గతమాస కష్టనివారణ - శుక్ర గ్రహోచ్ఛస్థితివల్ల స్థానికముగా అనుకూలస్థితిగతులు ఏర్పడును. ఉద్యోగగౌరవప్రాప్తి - శత్రురోగ ఋణబాధల శాంతి, నూతనప్రయత్నధనలాభప్రాప్తి - ఆరోగ్యము - స్థిరవసతి-గృహనిర్మాణవిషయిక ప్రయత్నములు, గొప్పవారితోను స్నేహితులతోను సంబంధమువల్ల ధనసహాయము, బంధుసమాగమము, శుభకార్య ప్రయత్నములు - ఆరోగ్యము - పుణ్యకార్యచింతన - దైవచింతన - దైవభక్తి - కుటుంబ భేదాభిప్రాయములు.

(ఈ సంవత్సరములో కార్తీకపౌర్ణమి - అశ్వినీనక్షత్రముతో కలియుటవల్ల అక్కడక్కడ దేశములో ధూమకేతుసందర్శనము - గొప్పవారి (ప్రభుజన) పీడలు - మరణపరిస్థితులు - నదీప్రవాహములు - నదులు పొంగట - వ్యవసాయ నష్టములు - జననాశం - మొత్తముమీద నవంబరు మొదలు 1953 మార్చి వరకు ప్రభువులకు. ప్రజలకు విరోధాలేగాక యుద్ధప్రయత్నములుకూడ జరిగి ఎక్కువ అశాంతి యేర్పడు సూచనలు గనబడుచున్నవి)

ANDHRA RASTRA PRARAMBHA VIDYA

Regd. M.N. 3766 Vol. 41. - No. 1